# కేరింత

తవ్వా ఓబుల్ రెడ్డి

బడికి సమయం మించిపోతుండడంతో ఆతృతతో బస్సు దిగి వడిగా అడుగులేస్తున్న నాకు, 'ఆకాశవాణి' లాగా పరిచయమైన గొంతు ఒకటి వినబడింది. టక్కున నిలబడి దిక్కుల వైపు చూశాను. ఆ గొంతు వినబడుతూనే ఉంది. నా తల పైన ఉన్న చింత చెట్టు నుండి రెండు పండిన చింతకాయలు నా కాళ్ల ముందర తపాన పడినాయి. తలెత్తి చింతచెట్టు కొమ్మల్లోకి పరిశీలనగా చూస్తోంటే పై నుంచి పకపకా నవ్వు వినపడింది. ఆ నవ్వు ఎవరిదో టక్కున ఊహించుకున్నాను.

''ఒరే రామిరెడ్డీ...రెండు రోజుల నుండీ బడికి రాలేదేమిరా?'' అంటూ ప్రశ్నించాను. చెట్టు కొమ్మల్లోనుండీ మరో ఇద్దరి నవ్వు కిసక్కున వినబడింది. ఆ నవ్వులు రామిరెడ్డి సావాసగాళ్లైన బాల పుల్లయ్య, వెంకటేశు గాళ్లవేనని అర్థం అయింది.

నేను నిలబడేసరికి, చిటారు కొమ్మన ఉన్న రామిరెడ్డి కోతిలాగా రెండు అంగల్లో చెట్టు మొదల్లోకి వచ్చి అక్కడే ఆగిపోయినాడు. వాడి చొక్కా నిక్కరు జేబులు, కప్పను తిన్న పాములా ఉబికి ఉన్నాయి. జేబుల బొరల్లోనుంచీ చింతకాయలు బయటికి నిక్కబొడుచుకుని వచ్చాయి. కిందికి దిగి నా దగ్గరికి రావడానికి సంశయిస్తూ వాడు చెట్టు మొదల్లోనుండే ఇగిలిస్తూ నమస్కారం పెట్టినాడు.

''బడికెందుకు రాలేదురా'' మళ్లీ గద్దిస్తూ అడిగాను. నా గద్దింపంతా నటనే అని అనుకున్నాడేమో గాని, మళ్లీ కిసక్కున నవ్వినాడు.

''సార్ నేను బడికి రాను సార్..! బర్రెగొడ్లకు పోతాండ సార్.'' ఎలాంటి భయం లేకుండా చెప్పినాడు రామిరెడ్డి. వాస్తవానికి వాడి పేరు అది కాదు. అసలు పేరు ఈశ్వరయ్య. బలంగా బొద్దుగా ఉన్న ఈశ్వరయ్య సినిమా విలన్ రామిరెడ్డిలా డైలా



గులు చెబుతోంటే ఇళ్ళల్లో వాళ్లు వాడికి రామిరెడ్డి అని పేరు పెట్టినారు. స్కూలు రిజిష్టరులో "ఈశ్వ రయ్య" అనే ఉన్నప్పటికీ ఎందుకో నాకు కూడా 'రామిరెడ్డి' అని పిలవడమే సరదా! బడికొచ్చే పిల్ల లందరూ కూడా వాడ్ని అలాగే పిలుస్తారు.

రెండు రోజులుగా బడికి రాకపోయేటప్పటికీ రామిరెడ్డిపై నాకేమాత్రం కోపం రాలేదు. పైగా తాను ఎందుకు బడికి రాలేకపోతున్నాడో భయం లేకుండా చెప్పడం నాకు నచ్చింది. చెట్టు మొదల్లో అలాగే నిలబడి ఉన్నవాడు ఒక జేబులోంచి చింత కాయలు తీసి నా వైపునకు విసిరాడు. చింతకా యలు కింద పడకుండా పట్టుకోడానికి నేను కొంత ఇబ్బంది పడినప్పటికీ, అతి కష్టం మీద పట్టుకోగలి గాను.

"సార్...! చింతకాయలు తింటా బడికి పో...సార్..! బలే తియ్యంగ ఉండయ్...సార్...!" అంటూ ఏదో కూనిరాగం తీస్తూ చిటారు కొమ్మకు ఎగబాకుతూ పోయినాడు వాడు. చింతపండు ఒక పిచ్చ ఒలుకుచుని చప్పరిస్తూ బడి వైపు అడుగులు వేస్తున్న నాకు రామిరెడ్డిని గురించిన ఆలోచనలే వస్తున్నాయి.

నాలుగో తరగతి చదువుతున్న రామిరెడ్డి చాలా హుషారైన వాడు. సాయంత్రం బడి చివరి గంటలో ఏ రోజైనా పాటలు పాడిస్తే రామిరెడ్డి జోరు చెప్పన లివి కాదు. ఒక పక్క పల్లె పాటలు పాడతాడు. కొత్త సినిమాల పాటలకు డాన్సులు అదరగొడ్తాడు. పాఠం చెప్పిన తర్వాత తరగతిలో అందరి కంటే ముందుగా రామిరెడ్డే టక్కున జవాబులు చెబు తాడు. అంత తెలివైన పిల్లోడు బాగా బడికి రాలేక పోతున్నాడనే బాధ అప్పుడప్పుడు నన్ను వేధిస్తూ ఉంటుంది. బడికి ఎందుకు రాలేదని గట్టిగా ప్రశ్నిస్తే "మీకు శెలవులు ఉన్నెట్లే మాకూ ఉండాల సార్..!" అంటూ ఫక్కున నవ్వుతాడు. ఆ నవ్వు లోని స్వచ్ఛత, వాడి ఆలోచనల్లో సూటిగా ప్రశ్నించే తత్వమే- వాడి పట్ల నాలో ప్రేమ, సాను భూతి కలగడానికి కారణాలేమో! వాణ్ణి బెత్తం ఎత్తి ప్రశ్నించడానికి కూడా నాకు మనసు ఒప్పదు. అయినా కోపం నటిస్తూ ఉంటాను.

"ఏంది సార్ వానితో గోము పడతాండవ్...! ఈత మెల్లె తీసుకోని వట్టికాళ్లకేసి నాలుగు పెరు కులు పెరుకు సార్..!" అంటూ బడి దగ్గరికి వచ్చి అనేవాళ్లు కూడా లేకపోలేదు. రామిరెడ్డిని ఏ విధంగా బడికి రప్పించుకోవాలనే ఆలోచన నన్ను తొలుస్తూనే ఉంది.

చదువుల పండగ వచ్చింది. పదిరోజులపాటు నిజంగా పిల్లలకు పండగే! రంగు కాగితాలతో, మామిడి, కొబ్బరి ఆకులతో పిల్లలే బడిని అలంక రించారు ఉత్సాహంగా! చదువుల పండగకు లౌడ్ స్పీకర్‌ను ఏర్పాటు చేసుకున్నాం.

గాలిపటాలను తయారుచేసుకున్నాం. ఊళ్లో ఊరేగింపు జరిపినాం! పిల్లలంతా కాగితాల టోపీ ధరించి, సాక్షరతా నినాదాలతో, పాటలతో హోరె త్తించారు. చాలా రోజులుగా బడికి రాని రామిరెడ్డి ఎప్పుడు వచ్చినాడో ఊరేగింపులో కలిసి పోయి ఉన్నాడు. మైకు తీసుకుని పాట అందుకున్నాడు. పాటకు తగినట్టుగా అభినయం కూడా చేస్తు న్నాడు. చదువుల పండగ సందర్భంగా జరిగిన ఆటల పాటల పోటీల్లో క్రమం తప్పకుండా రామి రెడ్డి పాల్గొంటున్నాడు. బడికి రమ్మంటే బర్రెలకు పోతానని మొరాయించే రామిరెడ్డేనా వీడు? అనే అనుమానం కలిగింది.

చదువుల పండగ అయిపోయింది. బడిలో పిల్లల సంఖ్య కొంత పెరిగింది. రాంరెడ్డి మాత్రం రెండు రోజులు వచ్చి ఆ తర్వాత కనిపించలేదు. వాడు వంక మడుగుల్లో ఈతాడుతూ కనిపించా డనీ, బొంగరం తయారు చేసుకునేందుకు ఒంటి బోడు ఎక్కి కొయ్య కొట్టుకువచ్చాడనీ, కొండ కట్టెల్లో తేనె తట్టు రాల్చినాడనీ, రామిరెడ్డి ఆచూకీని గురించిన కథలను పిల్లలు రోజూ పొద్దున్నే చెబుతు న్నారు. రామిరెడ్డిని బడికి రప్పించడానికి ఏం చేయాలో నాకు ఏమాత్రం అర్థం కాలేదు. రామిరెడ్డి తల్లి దండ్రులను కలిసి మాట్లాడితే బాగుంటుంద నుకున్నాను.

"వాడు వస్తే బంగారంగా తోలుకుని...పో.. సారూ...! మేము వద్దంటాండమా? వాడే పని సేచ్చాండడు... ఎప్పుడన్నా మాకు కూలి పనులు దొరికినప్పుడు అదో.. ఆ బర్రె గొడ్లకు పోతడు అంతే..! వాడు చదువుకోని బాగుపడితే మాకు గూడా మేలే గదు సారూ...!" అవేదనగా అన్నారు రామిరెడ్డి తల్లి దండ్రులు.

రామిరెడ్డి నాయన చర్మాలకు కర్ర వేసి, గిరాకీ ఉన్నెప్పుడు నాలుగు రూపాయలు సంపాదించు కుంటాడు. అమ్మ, అక్క కూలి పనులకు పోతారు. పెద్దన్న మేకలకు, రెండో అన్న బర్రె గొడ్లకు పోతారు. కూలిపనుల కసాల్లో మాత్రం ఇంట్లో అందరూ పనులకు పోతే, రామిరెడ్డి బర్రెగొడ్లకు పోతాడు. కూలి పనులు లేని రోజుల్లో రామిరెడ్డికి రెక్కలొస్తాయి. వంకలమ్మడీ, వాగులమ్మడీ, చెట్ల మ్మడీ, చేలమ్మడీ ఎక్కడ చూసినా రామిరెడ్డే. మరి కొందరు బడి దొంగలతో రామిరెడ్డి జత కడుతూ ఉంటాడు. వాళ్లు ముదుర్లు. నేను కాలి బాట వెంబడి బడికి పోతున్నప్పుడు ఏ కంప చెట్ల మాటునో తచ్చాడుతూ ఉండి, నన్ను చూసి ఉరు కుతూ ఉంటారు. ఈ సావాసగాళ్లలో లచ్చు మయ్య, పోలయ్య ముఖ్యులు. రామిరెడ్డిని బడికి రప్పించుకోవాలంటే లచ్చుమయ్యను పోలయ్యను రామిరెడ్డి వెంట పోకుండా తప్పించాలని ఆలో చించాను.

లచ్చుమయ్య, పోలయ్యల ఇళ్లకు వెళ్లి, వాళ్లను బడికి పంపించాలని, చదువుకుంటే వాళ్ల భవిష్యత్తు బాగుంటుందని తల్లి దండ్రులకు చెప్పినాను. తమ పిల్లలు కొరగాకుండాపోతున్నారని వాళ్లు కూడా చాలా బాధ పడినారు.

"నీకెందుకు సార్..నాయాళ్లను గుదికాళ్లు కట్టు కొచ్చి బళ్లో ఏచ్చం. కొడ్తవో...తిడ్తవో...నీ ఇష్టం. పిల్ల నాకొడుకులు బాగు పడితే పదికాలాల పాటు నీ పేరు చెప్పుకుంటం" లచ్చుమయ్య పోలయ్యల పెద్దోళ్లు ఇద్దరూ కూడబలుకున్నట్టుగా ఒకే మాట చెప్పినారు.

వాళ్లు చెప్పినట్లుగానే మరుసటి రోజు నుండే లచ్చుమయ్య, పోలయ్యలను బళ్లో వేసినారు. అంటే ఇంటికాడ భయం, ఇటు నా భయం కార ణంగా వాళ్లిద్దరూ బడికి రాక తప్పలేదు.

రామిరెడ్డి ఇప్పుడు ఏకాకి అయినాడు. సావాస గాళ్లు లేక దిక్కుతోచక వాడు కూడా బడికి వచ్చి తీరుతాడని అనుకున్నాను. అయితే వాడికి లచ్చు మయ్య, పోలయ్యల మాదిరిగా ఇంట్లో పెద్దోళ్ల భయం లేదు. అందువల్లే గాలి తిరుగుళ్లు బాగా అలవాటయ్యాయి.

రెండు రోజులు గడిచింది. రామిరెడ్డి ఆచూకీ గురించి పిల్లలను ఆరా తీసినాను.



''సార్! రామిరెడ్డి ఒంటిబోడు కాడ కుందేలు దొరికిందని ఇంటికి తెచ్చుకున్నెడు.. సార్... ఎప్పుడు చూసినా ఆ కుందేలు పిల్లతోనే ఆడుకుంటాంటడు సార్!'' నాలుగో తరగతి ఎల్లయ్య ఉప్పందించినాడు.

''సార్ రామిరెడ్డి కాడ నెమిలి గుడ్లు ఉండయ్ సార్? వాళ్ల నాయన ఎంటమ్మడి కొండకు కట్టెలకు పోయి తెచ్చుకున్నెడు... సార్...! వాళ్లింట్లో కోడిపెట్ట కింద ఆ గుడ్లను పెట్టినాడు సార్..'' మూడవ తరగతిలోని అశోక్ కళ్లు పెద్దవి చేసుకుంటూ మరింత సమాచారాన్ని అందించినాడు.

రామిరెడ్డి వైఖరి గురించి వాడి మనస్తత్వం గురించి ఆలోచిస్తూ గతంలో వాడి ప్రవర్తనను గుర్తు చేసుకున్నాను నేను. పాఠాలు వల్లె వేయడం, అడిగిన ప్రశ్నలకు జవాబులు అప్పచెప్పడం, కాపీ రైటింగులూ, డిక్టేషన్లు రాయడం పిల్లలు రోజూ చేస్తున్న పనే. బడికి రావాలంటే భయపడే పిల్లలు, రెండు మూడు రోజులు శెలవులు వస్తే ఒకటే కేరింతలు. ఆటలు ఆడించినా, పాటలు పాడించినా తమను తాము మరిచిపోయి, ఇట్టే కలిసిపోయి గెంతులు వేసే మనస్తత్వం వారిది. ఈ అంశాలకు రామిరెడ్డి ప్రవర్తనకి సంబంధం ఉండి ఉంటుందని అనిపించింది నాకు. దీపావళి పండుగ వచ్చింది. పండగకు వరుసగా రెండు రోజులు శెలవులు రావడంతో పిల్లల సంతోషానికి అవధుల్లేవు. పండుగ అయిపోగానే యూనిట్ పరీక్షలుంటాయని చెప్పగానే ఆ సంతోషం టక్కున మాయమైపోయింది. చదువుల పండుగలో నిర్వహించిన ఆటల పోటీలలో గెలిచిన వారికి బహుమతులను పండుగ తర్వాత ఇస్తానని చెప్పగానే పిల్లలు మళ్లీ కేరింతలు పెట్టినారు.

దీపావళి పండుగ గడిచిపోయింది. పిల్లకిచ్చేందుకు బహుమతులను తీసుకెళ్లినాను. ఆ రోజు పిల్లలందరూ హాజరైనారు. రామిరెడ్డి వెనుక వరుసలో గోడకు ఆనుకుని కూర్చుని ఉండడం నాకు ఆశ్చర్యం కలిగించింది. బహుమతులు ఇస్తున్నందు వల్లే రామిరెడ్డి ఈ రోజు బడికి వచ్చి ఉంటాడని అనుకున్నాన్నేను. బహుమతులను పంచేందుకు సన్నద్ధం అవుతుండగా బడిలో పిల్లల్లో కలకలం బయలుదేరింది. అందరూ కేకలు వేస్తూ ఎగురుతున్నారు.

''కుందేలు...కుందేలు...!'' అని పెద్దగా అరుస్తున్నారు వాళ్లు.

''సార్! రామిరెడ్డి వళ్లో తెల్లటి కుందేలు పిల్ల ఉంది. చెవులు నిక్కబొడుచుకుని లేత కళ్లతో  బిక్కు బిక్కుమంటూ చూస్తూ కొంత దూరం గెంతిందది. కుందేలు పిల్లను పిలుస్తున్నట్టుగా రామిరెడ్డి ఏదో శబ్దం చేసినాడు. అది ఎగురుకుంటూ వచ్చి రామిరెడ్డి వళ్లో కూర్చుంది.

స్నేహితులను దూరం చేస్తే రామిరెడ్డి బడికి వస్తాడని, భావించి నేను పొరబడినానని అప్పుడు స్పష్టం అయింది.

ప్రకృతి, పరిసరాలు, చెట్లు, చేమలూ, మూగజీవాలూ మనిషి జీవనశైలిని ప్రభావితం చేస్తాయని, నాలుగు గోడలే లోకం కాదని అందుకు రామిరెడ్డే ఒక మంచి ఉదాహరణ అని అర్థం అయింది నాకు. పిల్లలకోసం తెచ్చిన బహుమతులను సంచిలో నుండీ బయటికి తీశాను. రామిరెడ్డిని ముందుగా పిలిచి ఒక మంచి పెన్నును బహుమతిగా అందచేశాను. పిల్లల చప్పట్లతో బడి మార్మోగిపోయింది.

ఇది ఆటలపోటీ బహుమతి కాదనీ, కుందేలు పిల్లలతో స్నేహం చేస్తున్నందుకనీ, రామిరెడ్డిని అభినందిస్తూ చెప్పినాను. వాడి కళ్లల్లో ఆనందం, కృతజ్ఞత వ్యక్తమైంది.

''ఈ పొద్దునుంచీ కుందేలు కూడా రోజూ బడికి వచ్చది సార్...!'' చంకలో పెట్టుకున్న కుందేలును నిమురుతూ నవ్వినాడు రామిరెడ్డి.



ఉదయం పది గంటలకే కనుగుడ్లు కందిపోయేట్లుగా ఎండ తీక్షణంగా కాస్తోంది.

ఆకులు రాలి దిగంబరంగా మారిన సుంకేసుల చెట్టు ఏదో మాయావృక్షంలా గోచరిస్తోంది. బడి ఆవరణంలోని ఆ చెట్టుపై వాలిన కాకి ఒకటి దాహంతో నీళ్ల కోసం ఇప్పటిదాకా అరిచి అరిచి ఎటో ఎగిరిపోయింది. కనుచూపు మేరలో చేలన్నీ నెర్రెలు చీలి కనిపిస్తున్నాయి. భూమిపొరల్లో సారం పీక్కుపోవడంతో నీటి [illegible] పోయినాయి.




# బుడుక్కు తినేటోళ్ళు

11

**జీవని** ఆరునెలల తమ్ముడిని సంకలో వేసుకుని తన ఇద్దరు చెల్లెళ్ళతో బడి ఆవరణంలోని చెట్టుకింద ఆడుకుంటోంది. ఆకలిగా ఉందేమో సంకలో పిల్లవాడు ఏడుపు మొహంతో దిక్కులు చూస్తున్నాడు. జీవని, ఆ అమ్మాయి చెల్లెళ్లిద్దరూ తమ్ముడి దృష్టిని ఆకలినుండి ఆటల వైపునకు మళ్ళించాలని ప్రయత్నిస్తున్నారు. పిల్లవాడి ఏడుపు మరింత పెద్దదైంది.

జీవనికి పదేళ్లుంటాయి. ఒక చెల్లెలుకు అయిదేళ్లు, మరో చెల్లెలుకు మూడేళ్లుంటాయి. ఎక్కడో కర్నూలు జిల్లా పులకుర్తి నుండి బుడ్డలసుగ్గి పనులకోసం కడపజిల్లాలోని ఈ మారుమూల పల్లెకు నలుగురు పిల్లలతో వలస వచ్చినారు, జీవని వాళ్ళ అమ్మా నాన్నలు. పొలంలో శనక్కాయలు తెంపే పనిని 'బుడ్డలసుగ్గి' అంటారు వాళ్ళు. గత నాలుగేళ్ళుగా ఈ ఊరికే బుడ్డల సుగ్గికి వస్తున్నారు. జీవని మొదటిసారి వచ్చినప్పుడు పెద్ద చెల్లెల్ని సంకలో వేసుకుని ఉండింది. రెండోసారి వచ్చినప్పుడు రెండో చెల్లెల్ని ఎత్తుకుని ఉండేది. బడి పిల్లలతో, టీచర్లతో పరిచయంగా ఉండి జానపద గేయాలూ అవీ పాడేది. మధ్యాహ్నం బడిలోనే అన్నం పెట్టించుకు తినేది. పిల్లలతో కలిసి పాతపాత ఆటలు ఆడేది. బడిపిల్లలకు గిరి గిరి ఆట, చెండాట, వుల్లాట, గజ్జ పిచ్చుకలాట, వానగుంతలాట... ఇలాంటి ఆటలన్నీ నేర్పింది. అప్పుడప్పుడూ పాటలు కూడా చదివేది. జీవని చురుకుదనాన్ని మెచ్చుకుని టీచర్లు చిన్నచిన్న బహుమతులు కూడా ఇచ్చినారు. అయితే కరువు జీవని చదువును పక్కకు తోసేసి వలస బాట పట్టించింది.

తెలుగు గంగ కాలువకు నీళ్ల రాకపోవడంతో ఇక్కడ కూడా పంటలు పండలేదని పాపం తెలియదు వాళ్ళకు. ఈ ఊర్లో వాళ్ళకే పనులు లేక ఎక్కడెక్కడికో పొట్టచేత పట్టుకుని వెళ్లారని తెలిసి ఉసూరుమన్నారు వాళ్ళు. గుడ్డికన్నా మెల్ల మేలన్నట్టు ఆ ఊర్లోనే ఓ పెళ్లి ఇంట్లో గోడలకు సున్నం పూసేందుకు కూలి పనికి వెళుతున్నారు వాళ్ళు. వచ్చిన దారి పట్టుకుని ఊరికి వెళ్ళడానికి చార్జీలకైనా లెక్క దొరుకుతుందనే ఆశ వారిని ఈ పనికి పురమాయించింది. జీవని వద్ద ముగ్గురు పిల్లలను ఉంచి, తాగడానికి ఓ ప్లాస్టిక్ బిందెలో నీళ్ళు వుంచి, వాళ్ళు పనికి వెళ్ళారు. కూలిపని అయిపోగానే వచ్చి ఏదో ఒకటి చేసుకుని ఇంత పిల్లలకు పెట్టి, తామూ తిని రాత్రి అక్కడే బడి వసారాలోనే తలదాచుకుంటారు.

ఎండాకాలం శెలవులు కావడంతో బడి ఆవరణమంతా నిశ్శబ్దంగా ఉంది. తొమ్మిది గంటల బస్సుకు ప్రధానోపాధ్యాయుడు వచ్చినాడు. బడి ఉన్న రోజుల్లో అయితే బస్సు హారనే బడి గంట!

కరువొచ్చినందున శెలవుల్లో కూడా మధ్యాహ్న భోజనం పెడుతున్నట్టుగా ప్రభుత్వం ప్రకటించింది. ప్రధానోపాధ్యాయుడు మధ్యాహ్న భోజన పర్యవేక్షణ కోసం వచ్చి బడి వసారాలో కుర్చీ వేసుకు కూర్చుని, వెంట తెచ్చుకున్న పేపరు చదువుకుంటున్నాడు. దూరంగా పిల్లలతో ఆడుకుంటున్న జీవని ప్రధానోపాధ్యాయుని చూసి పరుగున వచ్చి నమస్కారం చేసి నవ్వుతూ నిలబడింది.

"ఆ జీవనీ...బాగున్నావా..!ఎప్పుడు వచ్చినారు?" ప్రశ్నించినాడు, ప్రధానోపాధ్యాయుడు.

"రాత్రి బస్సుకు వచ్చినాము సార్" అంటూ ఏడుస్తున్న తమ్ముడి దగ్గరికి పరుగు తీసింది జీవని.

తమ్ముణ్ని సంకలో ఎత్తుకుని, ఇద్దరు చెల్లె

## తవ్వా ఓబుల్ రెడ్డి




ళ్ళను తీసుకుని మళ్ళీ ప్రధానోపాధ్యాయుని దగ్గరకు వచ్చింది జీవని.

"ఏం...మ్మా ఆరవ తరగతి కదా నువ్వు... పరీక్షలు బాగా రాసినావా?" జీవనిని అడిగినాడు ప్రధానోపాధ్యాయుడు.

"లేదు సార్ బడి మానేసినాను...!" బాధపడుతూ చెప్పింది జీవని.

"ఏం...ఎందుకు?" కారణం అడిగినాడు, ప్రధానోపాధ్యాయుడు.

"పరీక్షలకు ముందే సుగ్గికి వచ్చినాము... సార్. ఆదేదో ఊర్లో ఇరవై రోజులుండి ఈ ఊరికొచ్చినము సార్...మా ఊరిబడిలో పరీక్షలు రాయనీకి ఎవరూ లేరు చూడి...అందరూ తలో దిక్కు సుగ్గికి పోయినారు" జీవని చెప్పింది. ఆలోచనలో పడినాడు ప్రధానోపాధ్యాయుడు.

"నమస్కారం సార్" అంటూ రాయప్ప వచ్చి ప్రధానోపాధ్యాయుని కుర్చీ పక్కగా కింద కూర్చున్నాడు. జిల్లా వార్తల పేపరు చేతిలోకి తీసుకుని అటూఇటూ తిప్పి మళ్ళీ ఎక్కడున్న పేపరు అదే చోట పెట్టినాడు రాయప్ప. రాయప్ప పన్నెండెళ్ళ వయసులోనే ఊరిడిసి పారిపోయినాడు. వేమయ్య గుర్రాల వెంబడి, రికార్డు డ్యాన్సుల వాళ్ళ వెంబడి దేశాలు పట్టుకొని తిరిగినాడు. అక్కడనే ఎవరో ఒకామెను పెళ్లి చేసుకున్నాడనీ, కొన్నాళ్ళ తర్వాత ఆమెను వదిలేసినాడనీ, ఏదో జబ్బుపడి నలభై ఏళ్ల వయసులో ఊరికి తిరిగి వచ్చినాడనీ ఊర్లో వాళ్ళు కథలుగా చెప్పుకుంటూ ఉంటారు. మధ్యాహ్నం పూట బడి దగ్గరికే వచ్చి వంటామెతో అన్నం పెట్టిచ్చుకుని తింటూ ఉంటాడు రాయప్ప.

"ఏం సార్...శెలవుల్లో కూడా వచ్చినారు... బడి ఉందాదా?" ఆసక్తిగా అడిగినాడు రాయప్ప.

"బడేమీ లేదు రాయప్పా...పిల్లలకు అన్నం పెట్టించి పోవాల గదా..." వచ్చిన కారణం చెప్పినాడు ప్రధానోపాధ్యాయుడు.

"కరువొచ్చి సచ్చాండమే...పిల్లోళ్ళతో పాటు, ముసలీ ముతకోల్లకూ, నాలాంటి రోగిష్టి నాకొడుకులకూ ఇన్ని గంజి నీళ్ళు పోయమని గవర్మెంటుకు చెప్పకూడదూ సార్" సూచనగా అన్నాడు, రాయప్ప.

"మేం చెబితే ఎవరు వింటారు? మీ పని మీరు చేయండి...మాకు తెలుసుగాని అంటారు... మీకు వోట్లేసిన నాయకులను అడగండి...ఏమైనా మేలు జరుగుతుందేమో" అన్నాడు, ప్రధానోపాధ్యాయుడు.



"ఆ...నాయకులకు ఇయ్యన్నీ కాబడతాండయా...వాళ్ళ ఆదాయాలు వాళ్ళు చూసుకుంటా వుండారు" నాయకులపై అసంతృప్తిని వెల్లడించినాడు, రాయప్ప.

"సరే.. ఇవన్నీ అయ్యే పనులు కాదు గానీ...ఇంకా ఏమిటి విశేషాలు" రాయప్పను అడిగినాడు ప్రధానోపాధ్యాయుడు.

"ఏం విశేషాలు ఉండాయి సార్. కరువు వచ్చె...జనాలు అల్లాడి ఆకులు మేచ్చాండారు...!

గొడ్డు గోదా సంతకు తోలి పిల్లాజెల్లా పొట్ట చేత పట్టుకోని ఎక్కడెక్కడికో పనులకు పోతాండారు" సమాధానంగా మళ్ళీ కరువు గురించి చెప్పినాడు రాయప్ప.

కొంతసేపటికల్లా పిల్లలకు అన్నం తీసుకుని వచ్చింది వంటామె. ఒక స్టీలు పాత్రలో అన్నమూ, ఒక గిన్నెలో పప్పుచారు తెచ్చి వసారా ఓ పక్కగా దించిందామె. ఈలోగా ఒక్కొక్కరుగా ఓ పదిమంది 'గుడు మానింగ్ సార్' అంటూ పిల్లలు గిన్నెలు పట్టుకుని వచ్చారు. వాళ్లంతా ఒకటీ, రెండు తరగతుల పిల్లలు. అంతా ఆరేడేళ్ళ వయసులోపు వారే. అన్నం వాసన పసిగట్టిన రెండు ఊరకుక్కలు రోజూలాగే వచ్చి గేటు దగ్గర నిలబడి ఎండకు నాలుక బయట పెట్టి వగిరిస్తున్నాయి.

బడిలో నాలుగైదు తరగతులు చదివే వాళ్ళె వరూ అన్నం కోసం రాలేదు.

"భానూ...సతీష్...ఓబులేశ్...మీనాక్షీ... మానస...స్వాతి...సంగీత...దివ్య...వీళ్లంతా ఎక్కడకు పోయినారు?" వచ్చిన చిన్న పిల్లలను అడిగినాడు ప్రధానోపాధ్యాయుడు, వీళ్ళు కూడా తమ పెద్దవాళ్ళ వెంట పనులకు వలస పోయారేమోనన్న అనుమానంతో.

"యాడుండారు సార్... వాళ్ల పెద్దోళ్ళు పనులకు పోతాంటే వాళ్ల ఎంబడి బెంగుళూరికి పోయినారు సార్...ఊర్లోని వయసు పిల్లోళ్ళు, నడివయసు వాళ్లంతా బెంగుళూరుకు వలసపోయినారు. అక్కడ బేల్దార్లుగా కూలీలుగా పని సేచ్చారు. పిల్లోళ్లకు కూడా ఇటుకలు మోసే పనులుంటాయి. ఇక్కడేమో కరువొచ్చి... ముసలీ ముతకా, నాలాంటి జబ్బులు చేసినవాళ్లూ, బాలింతరాళ్లూ, ఇలాంటి పసిపిల్లోళ్లు మాత్రమే ఊళ్లో మిగిలినారు సార్..." చెప్పినాడు, రాయప్ప.

తన అనుమానం నిజమైంది. పరీక్షలు అయిపోయేదాకా అయినా వాళ్ళు బడికి వచ్చినందుకు కొంత సంతోష పడినాడు, ప్రధానోపాధ్యాయుడు.

"ఎక్కడో కర్నూలు జిల్లా పిల్లలు ఇక్కడ..! ఇక్కడి పిల్లలు మరెక్కడో బెంగుళూరులో...!" మళ్ళీ ఆలోచనలో పడినాడు ప్రధానోపాధ్యాయుడు.

ప్రధానోపాధ్యాయుడు ఒకసారి సెల్లులో టైం చూసుకున్నాడు. పిల్లలకు ఒక్కొక్కరికీ అన్నం వడ్డిస్తోంది, వంటామె. జీవని తన చెల్లెళ్ళతో తమ్మునితో కలిసి వసారా దగ్గరగా వచ్చి అన్నం తింటున్న పిల్లలవైపు చూస్తూ అలాగే నిలబడింది. ఆ పిల్లలకు కూడా ఇంత అన్నం పెట్టమని ప్రధానోపాధ్యాయుడు వంటామెకు చెప్పడంతో ఆమె జీవనిని గిన్నె తెచ్చుకోమంది. జీవని పరుగున వెళ్లి చెట్టు కింద సామాన్ల మూటలోంచి గిన్నె తెచ్చుకుంది. ఆ పిల్లల గిన్నెల్లో పట్టెడన్నం కొంచెం పప్పుచారు వేసింది వంటామె. ఆ నాలుగు పిడచల అన్నమే పరమాన్నమైంది, ఆ పిల్లలకు. ఆబగా తిని చెట్టుకిందికి వెళ్లి ప్లాస్టిక్ బిందెలోని నీళ్లు తాగినారు వాళ్లు. ఊర్లోంచి వచ్చిన పిల్లలు కూడా గబగబా తిని... నీళ్ళకోసం ఎంగిలి గిన్నెలతో అక్కడనుండి తుర్రుమని ఉరికినారు.

ప్రధానోపాధ్యాయుడి దగ్గరనుండి లేచి వంటామె దగ్గరకు వెళ్ళినాడు రాయప్ప. అన్నం అయిపోయిందన్నట్టుగా ఖాళీగిన్నె చూపింది, వంటామె.

"ల్యాకుంటే మాల్లె...క్కా" అంటూ బాధగా ఇంటికి దారి బట్టినాడు, రాయప్ప.

బడి వసారాను శుభ్రం చేసి గిన్నెలు తీసుకుని వెళ్ళింది...వంటామె!

మరో రోజు గడిచింది. బస్సు హారను వినబడింది. పిల్లలంతా అలవాటుగా గిన్నెలతో బడి దగ్గరికి వచ్చినారు. రాయప్ప కూడా కొంత సేపటికి బడి దగ్గరకు వచ్చినాడు. రెండు కుక్కలు వచ్చి గేటు దగ్గర నిలబడి తోక ఊపుతున్నాయి. ఊర్లో పిల్లల రాకను గమనించిన జీవని చెల్లెళ్లు చెట్టు కింద సామాన్ల మూట లోంచి గిన్నెలు తీసుకుని వసారా దగ్గరికి వచ్చినారు. బస్సువచ్చి తిరిగి పోయింది. ప్రధానోపాధ్యాయుడు మాత్రం రాలేదు. వంటామె కూడా రాలేదు.

"ఓమ్మేయ్...యాడికి గిన్నెలు తీసుకుని రయ్యిన వచ్చాండారు. మేమే కూటికి గతి ల్యాక అడక్క తింటాఉంటే మీరొచ్చి బుడక్క తిందామనుకుంటాన్నారా?" కోపంగా జీవని వంక చూస్తూ అన్నాడు రాయప్ప. ఆ రోజు రెండో శనివారమనీ, శెలవు కాబట్టి అన్నం పెట్టరనీ గుర్తొచ్చింది... రాయప్పకు.

జీవని...ఊర్లో పిల్లలు ఎక్కడివాళ్లు అక్కడే నిలబడినారు..... కుక్కలు మాత్రం తోకలు ఊపుతూ....రోజూ వంటామె వచ్చే దారివైపు చూస్తూనే వున్నాయి.




## నామరూపాలు లేని కాలాన్ని నేను!

దుర్ముఖీ...!
అంతా మరిచిపోయేవు
అనంతకాలంగా
మన బంధం కొనసాగుతూంది !
నామరూపాలు లేని కాలాన్ని నేను
అరవై పదుల క్రితం నుండీ
అమ్మలా నిన్ను సాకుతున్నాను!
నేటికీ నన్ను 'దుర్ముఖీ...!'
అనడానికి నోరెలా వచ్చింది నీకు?
మాటనిచ్చి మమతనిచ్చి
మనిషిని చేశానని మరిచావా?
అవ్యక్త రూపం నుంచి
అనూహ్యంగా అశ్రుత సందేశం
అంతరంగంలో మెరుపు!
అయినా అనిపిస్తూనే ఉంది
ఎవరీ అపరిచిత ముఖం?
అర్థమయా అవని మాయ!
ఆ అవ్యక్త భావాన్ని
అందుకొన్న పిమ్మట
యావదజ్ఞానం జ్ఞాతమైన వేళ
అనిపిస్తుందిపుడు
అన్ని బంధాలను త్రెంచుకుని
మహాశూన్యంలోకి
నా చిరపరిచిత లోకంలోకి
మాయమైపోవాలని!

**మ.రా.శాస్త్రి**



# ఊరబడి



## 19

తవ్వా ఓబుల్‌రెడ్డి



**కా**లికి తాడుకట్టి దూరంగా ఈడ్చివేసిన కుష్టురోగిలా ఉంది, ఆ వూరి బడి. మసకబారిపోయిన బడిగోడలు మాత్రం వెన్నెల్లో తెల్లగా కనిపిస్తున్నాయి. బడికి ఫర్లాంగు దూరంలో ఊరు. ఊళ్ళో అక్కడక్కడా  విద్యుద్దీపాలు మినుకు మినుకుమంటూ ఉన్నాయి.

నోట్లో ముద్ద పడగానే గూట్లోని దియ్యను మలిపి కునుకు తీసే రోజులు ఎప్పుడో పోయాయి కదా! సీరియళ్ల చూస్తూ టీవీలకు అతుక్కుపోయి నట్లున్నారు, ఊరిజనమంతా. ఎవరికో పీడ తీస్తుంటే ఊళ్ళోని వాళ్ళంతా ఇళ్ళల్లోకి వెళ్ళి వాకిల్లేసుకున్నట్లుగా వీధులన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి. వీధి వెంట చిన్నగా అడుగులు వేస్తూ ఏవో కూనిరాగాలు పాడుతూ బడివైపు వస్తోంది, ఓ అకారం. ఆ అకారం బడిని సమీపించేకొద్దీ ఊతకర్ర శబ్దం వినిపిస్తోంది. చేతిలో అన్నం గిన్నె. చంకకు చిన్న జోలె.... ఎవరో బైరాగి! ఊళ్ళో తిరిగి అన్నం తెచ్చుకున్నట్లున్నాడు. బడి అవరణలోని

మంచినీటి బోరింగు దగ్గరికి వెళ్ళి కాళ్ళూ చేతులు కడుక్కున్నాడు. అన్నం తిని మళ్ళీ బోరింగు వద్దకెళ్ళి నీళ్ళు తాగి, గిన్నెను జోలెలో వేసుకున్నాడు. అగ్గిపుల్ల గీసి బీడీ వెలిగించుకున్న తర్వాత చిన్నగా కూని రాగంలా ప్రారంభించి తత్వగీతం అందుకున్నాడు.

"... గాలీ కంపనూ తెచ్చీ... గూడెళ్ళ నే కట్టీ...

గూటిలోనా రెండు గుడ్లు పెట్టీ...

గుడ్లూ పగిలీ పిల్లలు ఎగిసీపోవుటె గానీ...

గూటితో ఒక మాట సెప్పీ పోయేనా...!

... ఇలా సాగుతోంది, తత్వాలాపన. అగరు పొగలా బడి పరిసరాలను అలుముకుంటోంది, బైరాగి పాడుతున్న తత్వగీతం. ఇంతలో...

ఫక్కున నవ్వు...! పకపక నవ్వు...!!

బైరాగి తత్వగీతాలాపనను ఆపాడు.

మళ్ళీ అదే నవ్వు!

సమీపంలో ఎవరో స్త్రీ నవ్వినట్లుగా అనిపించింది, బైరాగికి. చీకట్లోనే అటూ ఇటూ పారజూశాడు. ఎవరూ కనిపించలేదు. బడి గది లోపల్నుండి ఎవరైనా నవ్వుతున్నారేమోనని అనుమానం వచ్చింది బైరాగికి. తాళం వేసి వున్న తలుపుల సందుల వద్ద చెవి పెట్టి, లోపలినుంచేమైనా శబ్దం వస్తోందేమోనని పరీక్షించాడు, బైరాగి.

మళ్ళీ అదే నవ్వు...! పకపక నవ్వు...!!

"లోపల ఎవరూ...?" బైరాగి ప్రశ్నించాడు.

నవ్వు ఆగలేదు...!

"ఎవరమ్మా? నిన్నే లోపల ఎవరుండారు?" స్వరం పెంచి ప్రశ్నించాడు, బైరాగి.

కొంతసేపు నవ్వు ఆగిపోయింది.

తెల్లని మల్లెపువ్వులాంటి దుస్తుల్లో దేవత లాంటి ఆకారం బైరాగి ముందు ప్రత్యక్షమైంది.

బైరాగి అప్రయత్నంగానే రెండు చేతులెత్తి నమస్కరించాడు.

"తత్వం బాగా పాడినావు పెద్దాయనా! మన ఇరువురి పరిస్థితికీ ఈ తత్వగీతం సరిపోయేలాగే ఉంది" అంది దేవతలాంటి ఆకారం.

"గుడ్లూ పగిలీ పిల్లలు ఎగిసీ పోవుటే గానీ...

గూటితో ఒక మాట సెప్పీ పోయేనా..!"

అంటూ బైరాగి పాడిన తత్వాన్ని తన కమ్మని కంఠంతో ఉచ్చరించింది... దేవత లాంటి ఆకారం.

"ఎవరు తల్లీ నువ్వు?" మళ్ళీ నమస్కరిస్తూ అడిగాడు, బైరాగి.

"నేనా?.... ఈ బడితల్లిని పెద్దాయనా!" అసలు తానెవరో చెప్పింది... బడితల్లి!

"బైరాగుల పరిస్థితి అందరికీ తెలిసిందే కదా...! చదువుల తల్లివి! నీకేమయింది తల్లీ?" ఆసక్తిగా ప్రశ్నించాడు, బైరాగి.

"చెబుతాను... సావధానంగా విను...!" అంటూ చెప్పడం ప్రారంభించింది, బడితల్లి.

"ఏ యాభై ఏళ్ళ కిందటో ఈ ఊళ్ళో పుట్టాను నేను. నిన్న, మొన్నటి వరకూ ఊళ్ళోవాళ్ళు నన్ను పవిత్రంగా, గౌరవంగా చూసుకునేవారు. నిండుగా పిల్లలతో కళకళలాడుతూ ఉండేదాన్ని! నా బడిలో చదువులు నేర్చుకున్న ఎందరో పిల్లలు మంచి మంచి హోదా కలిగిన ఉద్యోగాలను పొందారు.

జెండాల పండగొచ్చినా... మరే పండ గొచ్చినా నన్ను రంగు కాగితాలతో అలంకరించి చక్కగా తీర్చిదిద్దేవారు. జెండాల పండుగ రోజు ఊరి జనమంతా నా వద్దకు చేరి జెండా వేడుకను తిలకించేవారు. అయ్యవార్లనూ గౌరవించేవారు. దగ్గరున్న టౌన్లో ఆ ఇంగ్లీషు బడులు పెట్టిన తర్వాత నా దగ్గరికి వచ్చే పిల్లలు నాకు దూరం కాసాగారు.



ఆ కాన్వెంటు బళ్ళను కాన్సెప్టు స్కూళ్ళనీ, పబ్లిక్ స్కూళ్ళనీ, రెసిడెన్షియల్ స్కూళ్ళనీ... మరేవో కొత్త కొత్త పేర్లతో పిలుస్తున్నారులే! పల్లెల్లోని ఈ పేర్లు తెలియనివారు మాత్రం బస్సుబడి, ఆటోబడి, వ్యానుబడి, హాస్టల్‌బడి అంటూ ఒక్కో ఇంగ్లీషుబడికి ఒక్కో పేరుతో పిలు స్తున్నారు.

నా పిల్లలతో ఆ ఇంగ్లీషు బడిపిల్లలు కొట్లాడి నప్పుడు మా బడిని 'డొక్కుబడి', 'తుక్కుబడి' అని కూడా తిడతారని నా పిల్లలు మా అయ్యవార్లతో చెబుతూంటే విన్నాను. పాపం పసివాళ్ళు...! ఆ కాన్వెంటు పిల్లలకైనా ఏం తెలుసు? అక్కడ డబ్బులు కట్టలేనప్పుడు, దెబ్బలు తిన్నప్పుడు ఆ బడికి పోమంటూ తిరిగి నా బడిలో వాలే పిల్లలు కూడా ఉన్నారు.

ఇంగ్లీషుబడి మోజు ముదరకముందు మా బడికి వందమంది దాకా పిల్లలు వచ్చేవారు. ఇప్పుడు ఇరవైమంది రావడమే గగనకుసుమం అయింది. తక్కువమంది పిల్లలతో బోసిపోయినట్లుగా ఉంది నా పరిస్థితి. శెలవు రోజులు వస్తే నా పరిస్థితి విచార కరంగా ఉంటుంది. పక్షులు ఎగిరిపోయిన గూడులా ఉండిపోతాను. శెలవు రోజుల్లో నీలాంటి బైరాగులూ, భిక్షగాళ్ళూ, వలసకూలీలు నన్ను ఆశ్రయిస్తూ ఉంటారు.

కల్లాకపటం తెలియని పిల్లలంటే నాకు ఎంత ఇష్టమో... నా పిల్లలకు కూడా నేను అంతే ఇష్టం. ఐదవ తరగతి పిల్లలు పొద్దున్నే వచ్చి తలుపులు తీసి శుభ్రం చేస్తారు. చిత్రపటాలను పూలతో అలంక రిస్తారు. ప్రార్థన సమయంలో మంచి మంచి శ్లోకాలనూ, గేయాలనూ ఆలపిస్తారు. కొత్తగా బడికి వచ్చే పిల్లలు, బడినీ, పరిసరాలనూ కళ్ళు పెద్దవి చేసి వింత వింతగా చూస్తూ ఉంటారు.

బడికి వచ్చే పిల్లల్లో ఆడపిల్లలే ఎక్కువ. ఇరవైమందిలో ఇద్దరే ఇద్దరు మగపిల్లలు! ఊళ్ళోని వారు మగపిల్లలను ఇంగ్లీషు బడులకు పంపడం వల్ల.. పాపం! ఆడపిల్లలు మాత్రం ఈ బడికి వస్తూ ఉంటారు. ఈ కొద్దిమంది పిల్లల్లో కూడా మతిస్థిమితం లేని పిల్లలూ, అంగవైకల్యంతో బాధపడే పిల్లలూ ఐదారుమంది ఉంటారు. అయినా ఆటలతో, పాటలతో ఆ పిల్లలంతా ఆనందంగా ఇక్కడ చదువు కుంటున్నారు. ఇంగ్లీషు చదువుల పేరుతో టౌనుకు వెళ్తున్న చాలామంది పిల్లల పరిస్థితి నరకప్రాయంగా మారినట్లు కూడా తెలుసుకుంటున్నాను. గాలి, వెలుతురు లేని చీకటి గదులతో, బలవంతపు బట్టీ చదువులతో కుంగిపోతున్న పిల్లలు కొందరు అప్పు డప్పుడూ ఈ బడికి వచ్చి తమ బాధలు వెళ్ళబోసు కుంటూ ఉంటారు కూడా! ఆటపాటల కోసం మొహం వాచిన ఆ పసిపిల్లలను చూస్తే కడుపు తరుక్కుపోతుంది. తెలుగులో మాట్లాడిన పాపానికి నేరస్తుల్లా శిక్షలు అనుభవిస్తున్న పిల్లల మానసిక వేదనను అర్థం చేసుకునేవారే కరువయ్యారు.

ఇక బడిలో పిల్లల ప్రవర్తన, వారి కార్య కలాపాలూ చూసి నాలో నేను ఆశ్చర్యపోతూ ఉంటాను. విరామ సమయంలో పిల్లలను గమనించడం నాకో పెద్ద ముచ్చట! విరామ సమయపు గంట మోగగానే పంటచేలపై రివ్వున దూసుకువెళ్ళే గువ్వల గుంపు మాదిరిగా పిల్లలు తరగతుల నుండి బయటపడి వీధుల్లోకి పరుగులు తీస్తారు.

కొందరు పిల్లలు ఇళ్ళకు వెళ్ళి బియ్యమో, పప్పులో, బెల్లమో తెచ్చుకుని తింటూ ఉంటారు. కొందరు గబగబ అన్నం తినేసి వస్తారు. ఇళ్ళల్లోని గాదెలూ, సంచులూ శోధించి గింజలు పట్టుకువెళ్ళి అంగట్లో తినుబండారాలు తెచ్చుకుంటారు కొందరు.

ఆ కొంచెం విరామ సమయంలోనే పిల్లలు ప్రదర్శించే విన్యాసాలు అన్నీ ఇన్నీ కావు. కొందరు ఇసుకలో ఇళ్ళు కడతారు. ఇంకొందరు ఆటలు ఆడుతూ ఉంటే మరికొందరు పాటలు పాడుతూ ఉంటారు.

కొందరు పిల్లలు పలకలపై కర్రలతో మోదుతూ 'డప్పు'లా మ్రోగిస్తూ ఉంటారు. ఒకరిద్దరు పిల్లలు ఇవేమీ పట్టనట్టుగా తరగతి గదికి పరిమితమై పుస్తకాలతో కుస్తీపడుతూ ఉంటారు. విరామ సమయం ముగియగానే గంట మోగుతుంది. తుట్టెను చేరు కుంటున్న తేనెటీగల్లా పిల్లలు బిలబిలా తరగతి గదిలోకి చేరిపోతారు. క్షణాల్లో బడిని నిశ్శబ్దం ఆవహిస్తుంది. కాస్త వెసులుబాటు దొరికితే చాలు పిల్లలు అయ్యవార్లకు ఎన్నోన్నో విషయాలను చెప్పడం మొదలుపెడతారు.

ఊళ్ళో జరిగే చావు పుట్టుకలూ, పెళ్ళి పేరంటాలు, పోట్లాటలూ, ఘర్షణలూ ఏవైనా సరే... పిల్లలు బడికి మోసుకువచ్చి అయ్యవార్లకు చెబుతూ ఉంటారు. చేల గురించి, చెట్ల గురించీ, పుట్టల గురించీ ఉత్సాహంగా వివరిస్తూ ఉంటారు. తమ ఇళ్ళలో గేదెలూ, కుక్కలూ, మేకలూ ఈనితే పిల్లలకు అదో ముఖ్యాంశపు వార్త! దూడల గురించీ, కుక్క మేకల పిల్లల గురించీ వారి వర్ణన ఆసక్తికరంగా ఉంటుంది. ఊళ్ళో జరిగే ఉత్సవాలు, జాతరల గురించి పిల్లల బోగట్టా సుదీర్ఘంగానే ఉంటుంది. కొత్త బట్టలూ, పిండివంటలూ సరేసరి! ఊళ్ళోకి గుర్రాలు వచ్చినా, ఎలుగుబంటి వాళ్ళు వచ్చినా ఆ సమాచారం చెప్పే ఆతృతలో పిల్లలకు గుక్క తిరగడం కష్టమౌతుంది" అంటూ చెప్పడం కొంతసేపు ఆపింది బడితల్లి.

బైరాగి ఆసక్తిగా వింటూ ఉన్నాడు.

మళ్ళీ చెప్పడం ప్రారంభించింది, బడితల్లి.

"ఉన్న పిల్లలతో ఎలాగో కాలం గడుస్తుందనుకుంటే... ఆ తృప్తి కూడా మిగిలేట్లు లేదు. ఇరవైమందికి తక్కువైతే ఆ బడికి ఒక అయ్యవారునే ఉంచుతారని, పది మంది పిల్లలకు తగ్గితే అసలు బడినే మూసివేస్తారని ఈ మధ్య అయ్యవార్లు చెప్పుకుంటుంటే విన్నాను. బడిని మూసివేస్తే నేను అనాథలా మారిపోతానేమో? ఊర్లోని బడికి శెలవులు ఎక్కువనీ, బడి సమయంలో కూడా పిల్లలు ఇళ్ళకు వచ్చి సతాయిస్తూ వుంటారనీ, ఊళ్ళో ఉంటే పిల్లలు చెట్టుపుట్టల వెంట తిరగడం, బావుల్లో ఈతాడటం, కుంటల్లో చేపలు పట్టడం చేస్తూ ఉంటారని అందుకే టౌనులోని ఇంగ్లీషు బడికి పంపుతున్నామని కొందరు తల్లిదండ్రులు చెబుతూ ఉంటారు. ఇంగ్లీషు చదువులే చదివితే చాలు! జీవితానుభవం, పరిసరాల విజ్ఞానం అక్కరలేదనేది వారి భావనలా ఉంది.

గోరుచుట్టుపై రోకటిపోటులా ఈమధ్య అయ్యవార్లూ బందు చేశారు. ఇరవై రోజులు బడి మూతపడింది. సందట్లో సడేమియా అన్నట్లుగా నలుగురైదుగురు పిల్లల్ని ఇంగ్లీషు బడివాళ్ళు తన్నుకుపోయారు."

బడితల్లి తన కథను వివరిస్తూ కళ్ళనుండీ ఉబికివచ్చిన కన్నీటిని తుడుచుకోసాగింది. బడితల్లి ఆవేదనకు బైరాగి చలించిపోయాడు.

ఇంతలో బోరింగు దగ్గర ఏదో అలికిడి అయింది. ఊరివాళ్ళు ఎవరో నీళ్ళకోసం వచ్చినట్లున్నారు. ఇది గమనించిన బడితల్లి చటుక్కున అదృశ్యమైంది.

బైరాగి మళ్ళీ తత్వగేయం అందుకున్నాడు.

"గుడ్లూ పగిలీ పిల్లలు ఎగిసీపోవుటే గానీ...
గూటితో ఒక మాట సెప్పీపోయేనా?!"

అంటూ, తన వెంట తెచ్చుకున్న పట్టను బడి వసారాలో పరుచుకుని, పడుకున్నాడు బైరాగి.

కాలికి తాడుకట్టి ఊరికి దూరంగా ఈడ్చి పడేసిన కుష్టురోగిలా ఉంది... ఆ బడి! 